శ్రీః

# శ్రీధనుర్మాసమాహాత్మ్యము

సాంధ్రతాత్పర్యము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

 [Re. 0—8—0

# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| „ ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| „ విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| „ భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| „ కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 0 |
| „ శాంతిపర్వము | ... | 7 | 8 |
| „ ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణ పర్వము వరకు గలసంపుటము | ... | 7 | 8 |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | ... | 1 | 12 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| న్యాయవిచారణ, (ప్రహసనము) | ... | 0 | 8 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, మొదటిభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 1 | 0 |
| డిటో మూడవభాగము | ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 12 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 3 | 8 |
| పతివ్రతలచరిత్రలు | ... | 3 | 0 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| II భాగము | ... | 1 | [illegible] |

శ్రీః

# శ్రీధనుర్మాసమాహాత్మ్యము

సాంధ్రతాత్పర్యము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1940.

శ్రీః.

# శ్రీ ధనుర్మాసమాహాత్మ్యము

## సాంధ్ర తాత్పర్యము.

(కఘ)

**ఋషయః :—**

ఆఖ్యాతం భవతా సూత! తులస్యాశ్చ ప్రభావకం,
సర్వాఘౌఘహరం పుణ్యం భుక్తిముక్తిప్రదం శుభమ్ ౧
ఇదానీం శ్రోతుమిచ్ఛామో ధనుర్మాసస్య వైభవం,

**సూతః :—**

నారదాయ పురా గీతం బ్రహ్మణా పరమేష్ఠినా. ౨
తదద్యోఽహం సంప్రవక్ష్యామి శృణుధ్వం భక్తిపూర్వకం,
వ్రతానాం చైవ సర్వేషాం దానానాం యజ్ఞకర్మణామ్. 3
అధికం సర్వపుణ్యానాం ధనుర్మాసఫలం శుభం,

---

శ్రీనైమిశారణ్యపుణ్యక్షేత్రంబుననుండు శౌనకాదిమునీంద్రులు పౌరాణికోత్తముఁడైన సూతుం గాంచి యిట్లనిరి. ఓమహాత్మా! సకలపాపపుంజంబులం బోఁగొట్టి భుక్తిముక్తిప్రదంబై శుభకరంబగుచున్న తులసీప్రభావంబెల్ల మాకెఱింగించితిరి ఇంక ధనుర్మాసమాహాత్మ్యం బెట్టిది? దాని వినంగోరెదము. కృపం జెప్పవే యని వేఁడిన సూతుం డిట్లనియె. ఓమునీంద్రులారా! పూర్వంబునఁ జతుర్ముఖుఁడు తనపుత్రుఁడైన నారదమునీంద్రునకుం జెప్పినదానిఁ జెప్పెద. భక్తిపూర్వకంబుగా వినుండు. సకలవ్రతంబులకంటెను నిఖిలదానయజ్ఞాదులకన్నను ధనుర్మాసవ్రతం బధికంబు. శుభంబుల నెల్ల నిచ్చునని బ్రహ్మాది

వదంతి మునయస్సర్వే దేవా బ్రహ్మాదయస్సురాః. ౪

ఋషయః :—

తత్కథం మునిశార్దూల! పూర్వస్యాధికముత్తమం ?

సూతః :—

ధనుర్మాసస్య మాహాత్మ్యం వక్తుం విస్తరతో మయా. ౫
న శక్యతే మునిశ్రేష్ఠా! స్తథా వర్షశతైరపి,
అన్యేషు చ పురాణేషు విస్తరేణ ప్రకీర్తితమ్. ౬
సంక్షేపాదభిధాస్యామి శృణుధ్వం భక్తిసంయుతాః,
ధనుస్సంక్రాంతిమారభ్య మాసమేకం వ్రతం చరేత్. ౭
జపాద్ధోమాత్తథా దానాద్యాగాచ్చ తపసోఽపి చ,
ధనుర్మాసం విశిష్టం హి పురాణే పరికీర్త్యతే. ౮
అకర్మణా కృతా పూజా కార్ముకే విష్ణువల్లభే,
అపునర్భవదా ప్రోక్తా సత్యముక్తం ద్విజోత్తమాః! ౯
యస్సంపదం సముద్దిశ్య కరోతి మనుజో ముదా,

సురలెల్లఁ జెప్పుదురు. అన విని మునీశ్వరులు సర్వోత్తమ మెట్ల య్యెనని యడుగ సూతులవా రిట్లనిరి. ఆధనుర్మాసవైభవంబు సవిస్తారంబుగా నెఱింగింప వర్షశతంబులకైన నాకలవిగాదు. సకల పురాణంబులం జెప్పియుండుదాని సంక్షేపంబుగా మీకెఱిఁగించెద భక్తిచే వినుఁడు. ధనుస్సంక్రాంతిమొదలొకమాసం బీవ్రతంబుఁ జేయవలయును. జపతపోహోమంబులకంటెను దానయజ్ఞంబులకంటెను నీధనుర్మాసం బధికం బని సకలపురాణంబులం జెప్పంబడు. ఏనరుఁడైన యజ్ఞాదికర్మంబులం జేయకున్నను ఈధనుర్మాసంబున విష్ణుప్రీతికరంబైన పూజచేసెనేని యాతఁడు మరల జన్మంబు నొందఁ డిది నిశ్చయంబు. ఎవ్వఁడైన నైశ్వర్యంబు గోరి యాధనుర్మాసంబున విష్ణుపూజ గావించెనేని

స సంపదమవాప్నోతి సకలాం మునిపుంగవాః! ౧౦
అకృత్వా సర్వదానాని హ్యస్నాత్వా పుణ్యదా నదీః,
ఏకదా వా ధనుర్మాసమాచరేద్యది మానవః. ౧౧
సర్వదానస్నానఫలం ప్రాప్నోత్యేవ న సంశయః,
ఖాదన్మాంసం పిబన్ మద్యం సంగచ్ఛన్నంత్యజాతిభిః. ౧౨
సకృద్ధనుర్మాసచరాత్తత్పాపం నాశమాప్నుయాత్,
ఔపాసనపరిత్యాగీ దేవలాన్నస్య భోజనః. ౧౩
సురాపయోషిత్సంసర్గో గణికాన్నాశనస్తథా,
గణాన్నభోజనశ్చైవ పతితాన్నరతస్తు యః. ౧౪
యే చ మర్త్యాః ప్రముచ్యంతే ధనుర్మాసప్రపూజనాత్,
అనిషేవ్య రవిం వహ్నిమనుపాస్య పరాన్ సురాన్. ౧౫
శుభకామో హి మనుజో ధనుర్మాసం చరేద్యది,

---

అతఁడు మహదైశ్వర్యంబు నొందును. ఏనరుఁడైన సకలదానంబులం జేయక స్నానాదులం గావించకుండి యొకానొకప్పుడైన నీధనుర్మాసవ్రతంబు చేసెనేని అతఁడు సర్వదానఫలంబును నిఖిలస్నానఫలంబును బొందును. ఇందుకు సందియంబు లేదు. ఏమానవుఁడైన చండాలాదిసహవాసంబున మాంసంబు భుజించి మద్యంబు ద్రావి యొకప్పుడీధనుర్మాసవ్రతంబుఁ జేసెనేని యాతఁడు చేసిన పాపంబెల్ల నశించును. ఔపాసనంబుఁ జేయనివాఁడును దుష్టాన్నంబుల భుజించువాఁడును మద్యపానంబుఁ జేయువనితలం గూడువాఁడును గణికాన్నంబును గణాన్నంబును బతితునియన్నంబును భుజించువారును వీరెల్ల నీధనుర్మాసపూజ చేసిరేని పరిశుద్ధు లగుదురు. ఏమనుజుఁడైన సూర్యప్రార్థనంబును దేవతాపూజయుఁ గావించక శుభంబులం గోరి

ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకే వసేచ్చిరమ్. ౧౬
భగినీం గురుభార్యాం చ తథైవ చ రజస్వలాం,
భ్రాతృభార్యాం మిత్రభార్యాం మద్యపాం చ పరస్త్రియమ్.
హీనస్త్రియం చ విశ్వస్తాం యేఽభిగచ్ఛంతి రాగతః,
తాం గతిం సమవాప్నోతి ధనుర్మాసవ్యతిక్రమాత్. ౧౭
కపిలాగోసహస్రేణ కన్యాద్వాదశదానతః,
యత్ఫలం సమవాప్నోతి బ్రాహ్మణే భోజనే కృతే. ౧౮
బ్రహ్మలోకే చ వైకుంఠే కైలాసే భూతలేషు చ,
రంతుమిచ్ఛా భవేద్యేషాం తే కుర్వంతి వ్రతం శుభమ్.
చతుర్ణామపి వేదానాం సాంగానాం పారగామినాం,
యత్ప్రాతస్స్నాయినాం నిత్యమగ్నిహోత్రరతాత్మనామ్.

ధనుర్మాసవ్రతంబు గావించెనేని యాతఁడు సర్వపాపవిముక్తుఁడై విష్ణులోకంబు నొందును. ఎవ్వఁడైనను కామాతురుఁడై దన చెల్లెలిని గురుపత్నిని రజస్వలను భ్రాతృభార్యను మద్యపానంబు చేయుదానిని మిత్రభార్యను హీనజాతిం బుట్టినదానిని విశ్వస్తనుం బొందెనేని వాఁ డేగులోకంబునకు నీధనుర్మాసవ్రతంబుఁ జేయనివాఁ డేగును. కపిలాగోసహస్రంబును ద్వాదశకన్యాదానంబునుం జేసినవానికిం గల్గు పుణ్యం బీధనుర్మాసంబున బ్రాహ్మణుల కన్నం బిడినవానికిం గల్గును. మఱియు బ్రహ్మలోక వైకుంఠకైలాసంబులకుం బోవం గోరువాఁ డీవ్రతం బాచరించెనేని యభీష్టసిద్ధి నొందును. సాంగంబులైన వేదంబులఁ జదువువారును నిత్యంబును ప్రాతస్స్నానంబును చేయువారును నిరంతరం బగ్నిపూజలం జేసెడువారును నిత్యాన్న

నిత్యాన్నదానవ్రతినాం నిత్యశ్రాద్ధరతాత్మనాం,
సహాక్షిభోజనకృతాం నిత్యం గోపూజకారిణామ్. ౨౨

ఫలశాకస్వర్ణతామ్రకాంస్యలోహమయాన్ శుభాన్,
తాంబూలపుష్పధాన్యాదివస్త్రతండులమైక్షవమ్. ౨౩

నిత్యదానం కృతవతాం యా గతిః ప్రోచ్యతే బుధైః,
ధనుర్మాసాన్నదానేన సా గతిర్భవతి ధ్రువమ్. ౨౪

సహస్రం వా పంచశతం శతం వా మునిసత్తమాః!
పంచాశద్దశసంఖ్యాకాన్యథావిత్తానుసారతః. ౨౫

విప్రాన్వేదవిదశ్శాంతాన్ యతీంశ్చ నియమోజ్జ్వలాన్,
శాకైస్సూపైరనేకైశ్చ ఘృతభక్ష్యైర్మనోహరైః ౨౬

శాల్యన్నైర్దధిఖండైశ్చ పరమాన్నైరనేకధా,
శర్కరాకదళీస్వాదుఫలైస్తత్కాలసంభవైః. ౨౭

ఏవం యః కారయేద్విద్వాన్ బ్రాహ్మణాన్ భోజనం ముదా,

---

దానులును నిత్యశ్రాద్ధంబులం జేయువారును గోవులం బూజించువారును ఫలశాకంబుల స్వర్ణతామ్రకాంస్యలోహంబులు ధాన్యంబును తాంబూలపుష్పంబు లివి మొదలైనదానంబుల నిత్యంబుఁ జేయువారును వీరల కెల్లం గల్గుపుణ్యలోకంబులు ధనుర్మాసంబున నన్నదానంబు చేయువారికిం గల్గును. ఈధనుర్మాసంబున మనుజుఁడు దనకుంగల శక్తికొలంది వేయింటికైన నేనూటికైన నూటికైన నేఁబదింటికైన బ్రాహ్మణులకు ఘృతసూపభక్ష్యసమేతంబును దధిఖండమిశ్రితంబును పరమాన్నయుతంబు నైన శాల్యన్నంబును శర్కరాకదళీఫలాదులతోఁ గూడ నొసంగవలయు. అట్లు గావించినవాఁ డీలోకంబునఁ

ఇహైవ భుక్త్వా సకలాన్ పుత్త్రపౌత్రసమన్వితాన్. ౨౮
దాసీదాసాననేకాంశ్చ హస్త్యశ్వరథసంకులాన్,
భుక్త్వా భోగాననేకాంశ్చ స ఇహైవ సుఖం వసేత్. ౨౯
దీర్ఘాయుశ్చ నిరోగీ చ బహుమాన్యస్సమేషు చ,
తదంతే సర్వలోకేషు స్థిత్వా తత్ర వ్యవస్థితాన్. ౩౦
భుక్త్వా భోగాననేకాంశ్చ పునరావర్తివర్జితం,
మోక్షం వ్రజేన్మునిశ్రేష్ఠా! బ్రాహ్మణానాం తు భోజనాత్.
యే కుర్వంతి సదా భక్త్యా నరాస్సర్వత్రగామినః,

నారదః :—

తాత! కేన విధానేన ధనుర్మాసప్రపూజనమ్. ౩౨
విధినా కేన కర్తవ్యం? తత్ర కా నామ దేవతా?
కదా వా పరిపూర్ణం స్యాత్కదా వా తదుపక్రమః. ౩౩
ఏతత్సమస్తం విస్తార్య కథయస్వ పితామహ!

బ్రహ్మోవాచ :—

ఉదయాత్పంచఘటికాత్ప్రాతరుత్థాయ యత్నతః. ౩౪

---

గళత్రపుత్రపౌత్రమిత్రసమేతుండై దాసీదాసజనంబులు గొల్వ గజరథాశ్వంబుల నెక్కి దీర్ఘాయువు నిరోగియునై విహరింపుచు ననేకసుఖంబు లనుభవించి పిమ్మట స్వర్గలోకంబున బహువిధ భోగంబులం బొంది పునరావృత్తివర్జితంబైన మోక్షంబునొం దుననిన నారదుం డిట్లనియె. ఓతండ్రీ! యీధనుర్మాసవ్రతం బేవిధిం జేయవలయు? దీనికి దేవత యెయ్యది? ఆరంభం బెప్పుడు చేయవలయు? పరిపూర్తి యెప్పుడొందు? ఇది యెల్ల సవిస్తారంబుగా నెఱింగింపుమనిన బ్రహ్మ యిట్లనియె. ఓపుత్రా! నరుఁడు సూర్యోదయంబున కైదుగడియలకు ముందు లేచి

స్నానం కృత్వా ప్రథమతో నిత్యకర్మ సమాచరేత్,
కృత్వా సంధ్యాదికం చాపి వేదమాతుర్జపం తథా. ౩౫
యథోచితం కర్మ కృత్వా దేవపూజాం సమాచరేత్,
యథా సంకోచ్య తత్కర్మ భుక్త్వాఽల్పద్వాదశీదినే. ౩౬
తథా ప్రాతర్ధనుర్మాసే సర్వకర్మాల్పమాచరేత్,
పంచనిష్కప్రమాణేన తదర్ధార్ధేన వా పునః. ౩౭
ప్రతిమాం కారయేద్విద్వాన్యథాశక్త్యనుసారతః,
మధుసూదననామ్నా వై ప్రత్యహం పూజయేచ్చ తామ్.
ధనుస్సంక్రాంతిమారభ్య మాసమేకం వ్రతం చరేత్,
పూజయేత్ ప్రయతో భక్త్యా వాద్యఘోషపురస్సరమ్.
గోక్షీరం శంఖమాపూర్య స్నాపయేన్మధుసూదనం,
నారికేళోదకేనైవ తథా పంచామృతేన చ. ౪౦
స్నాపయేదథ విష్ణోశ్చ తులసీకోమలైర్దళైః,
సహస్రనామభిః పూజామన్యైః పుష్పైరనేకశః. ౪౧

---

స్నానసంధ్యాదినిత్యకర్మంబుల సంకోచంబుగాఁ జేసి పిమ్మట యథోచితంబుగా విష్ణుపూజం జేయవలయును ఏకాదశీవ్రతంబుఁ జేయువాఁ డల్పద్వాదశినాఁ డెట్లు నిత్యకర్మంబుల సంగ్రహంబుగాఁ జేయునోయట్టు లీధనుర్మాసవ్రతంబు చేయువాఁడును నిత్యకర్మంబులఁ జేయవలయును మానవుఁడు తనశక్తికొలంది పంచనిష్కప్రమాణంబుగా నైనఁ దదర్ధంబైనఁ బ్రతిమం గావించి మధుసూదననామం బిడి ప్రయతుఁడై వాద్యఘోషంబులు చెలంగ గోక్షీరనారికేళరసపంచామృతాదుల స్నానంబు గావించి కోమలంబులైన తులసీదళంబులను ననేకవిధ పుష్పంబుల నష్టోత్తరశతసహస్రనామంబులం బూజించి

ధూపదీపాదిభిర్దేవం తథాఽష్టోత్తరనామభిః,
నైవేద్యాన్నవిధానం వై ప్రవక్ష్యే శృణు నారద! ౪౨

బ్రహ్మోవాచ:—

ముద్గద్విదళసంఖ్యా తు తండులానాం తథైవ చ,
తయోః ప్రమాణం వక్ష్యామి ముద్గాన్నకరణేఽత్ర వై. ౪౩
తండులానాం సమం చేత్స్యాన్ముద్గాద్విదళముత్తమం,
మధ్యమం తండులార్ధం వై తదర్ధమధమం స్మృతమ్. ౪౪
ముద్గానాం ద్విదళం కేచిద్ద్విగుణం ప్రవదంతి హి,
మరీచిహింగులవణపాచితం సుమనోహరమ్. ౪౫
ముద్గద్విదళసంమిశ్రం శాల్యన్నమమృతోపమం,
సంగృహాణ హృషీకేశ! తవ ప్రీత్యై నివేదితమ్. ౪౬
గోక్షీరపాచితం దివ్యం సితశర్కరయాఽన్వితం,
పరమాన్నం తథా భక్ష్యై శాకైర్నానావిధైరపి. ౪౭
కదలీఫలగోక్షీరదధిఖండవిమిశ్రితం,

---

ధూపదీపాదు లొసంగి నైవేద్యంబొసంగవలయును. ఆనైవేద్య విధం బెఱింగించెద వినుము. తండులసమంబుగా ముద్గదళంబులం జేర్చి పొంగలి గావించుట యుత్తమంబు. తండులార్ధముద్గదళంబులం జేర్చుట మధ్యమంబు నాలవభాగంబు ముద్గదళంబులఁ జేర్చుట యధమంబు. కొందఱుపండితులు తండులంబులకు ద్విగుణంబుగా ముద్గదళంబులం జేర్చవలయునని చెప్పుదురు. నరుఁడు భక్తియుతుఁడై ఓకేశవా! మరీచిహింగులవణసహితంబును ముద్గద్విదళమిశ్రంబును అనేకశాకసమేతంబై మనోహరంబైన శాల్యన్నంబును గోక్షీరపాచితంబును సితశర్కరాయుతంబైన యీనైవేద్యంబు గ్రహింపు మని రెండుశ్లోకం

నైవేద్యం గృహ్యతాం దేవ! మధుసూదన! కేశవ! ౪౮
ఇతి దత్వా చ నైవేద్యం తాంబూలం సుమనోహరం,
హిరణ్యగర్భమంత్రేణ దక్షిణాం చ నివేదయేత్. ౪౯
నీరాజనేన వై దేవం పుష్పాంజలివిధానతః,
ప్రదక్షిణక్రమేణైవ నమస్కారేణ వై తతః. ౫౦
ప్రత్యహం పూజయేద్దేవమేవం పూజావిధానతః,
అర్ధమాసమిదం వత్స! ముద్గాన్నం విష్ణవేఽర్పయేత్. ౫౧
ఉషఃపూజాం ధనుర్మాసే యో న కుర్వీత మందధీః,
సప్తజన్మసు రిక్తస్స్యాత్తదంతే నరకం ధ్రువమ్. ౫౨
కోదండస్థే సవితరి మాసం ద్విదళశోభితం,
నైవేద్యం యోఽర్పయేత్తస్మై తస్య పుణ్యఫలం శృణు ౫౩
సహస్రవార్షికీ పూజా దినేనైకేన లభ్యతే,
యథేష్టం దధిఖండేన తద్గులానాగరేణ వై. ౫౪

---

బులు చెప్పవలయును. ఇట్లు నివేదించి దివ్యమైన తాంబూలమును నివేదించవలయును. హిరణ్యగర్భయనుమంత్రంబుపఠించి దక్షిణ నొసంగవలయు. పిమ్మట నీరాజనంబును బుష్పాంజలియుఁ బ్రదక్షిణనమస్కారంబులం జేయవలయును. ఇవ్విధంబునఁ బ్రతిదినంబును విష్ణుదేవుం బూజింపవలయును. ఒకయర్ధమాసం బిట్లు ముద్గాన్ననివేదనంబుఁ జేయవలయును. పిమ్మట రెండవయర్ధంబు దధ్యన్నంబును ముద్గాన్నంబును నొసంగవలయును. ఇవ్విధంబున నేమనుజుఁడైన ప్రాతఃకాలంబున ధనుర్మాసపూజ చేయకుండెనేని యాతఁడు సప్తజన్మంబుల దరిద్రుఁడై పుట్టును. ఎవ్వఁడైనభక్తియుక్తుఁడై ధనుర్మాసంబున నొకదినంబు దేవదేవుండైన విష్ణుదేవునకు నైవేద్యం బొసంగెనేని యతఁడు శతవర్షపూజాఫలంబు నొందును. ఎవ్వఁడైన దధిఖండంబుతోఁ

మరీచిహింగుసంమిశ్రం దధ్యన్నం స్వాదుసంయుతం,
మాసార్ధానంతరం వత్స! ముద్గాన్నేన సమం మునే! ౫౫
యో దద్యాదర్ధమాసం తు సామ్రాజ్యం లభతే ధ్రువం,
ముఖ్యాఽరుణోదయే పూజా మధ్యమా లుప్తతారకా. ౫౬
అధమా సూర్యసహితా తతో వై హ్యధమాధమా,
సూర్యోదయే ప్రశస్తం హి బ్రాహ్మణానాంతు భోజనమ్.
ద్విముహూర్తా త్పూర్వమన్నం మధ్యమం పరికీర్తితం,
త్రిముహూర్తాత్పూర్వమన్నమధమం మునిపుంగవ! ౫౭
ఉష్ణం ఘృతప్లుతం చాన్నం ముద్గద్విదళసంయుతం,
భక్ష్యశర్కరయా స్వాదు దధిఖండేన మిశ్రితమ్. ౫౮
శాకైరనేకైస్సంయుక్తం పరమాన్నం మనోహరం,
యోఽర్పయేద్బ్రాహ్మణేభ్యస్తు తస్య పుణ్యఫలం శృణు.
వారాణస్యాం ధనుష్కోట్యాం త్రివేణీ సంగమేఽపిచ,

---

గూడి ఏలామరీచిహింగుసమ్మిశ్రంబైన దధ్యన్నంబును ముద్గాన్నంబును మాసార్ధంబు నైవేద్యంబు గావించెనేని యతఁడు సామ్రాజ్యంబు నొందును. అరుణోదయకాలంబునఁ బూజ చేయుట యుత్తమంబు. నక్షత్రంబులు మాసినవెనుక మధ్యమంబు. సూర్యుఁ డుదయించిన వెనుక నధమం బని యెఱుంగుము. సూర్యోదయకాలంబున బ్రాహ్మణభోజనం బుత్తమంబు. దానికి రెండుముహూర్తకాలంబునకు మధ్యమంబు త్రిముహూర్తంబున కధమంబు. ఎవ్వఁడైన ధనుర్మాసంబున ముద్గద్విదళంబులం గూడి భక్ష్యభోజ్యసమేతంబై దధిఖండయుతంబై పరమాన్నంబుతోఁ గూడిన మనోహరంబైన యన్నం బొకబ్రాహ్మణున కొసంగునాతఁడు కాశీధనుష్కోటులను త్రివేణీ

యత్ఫలం ఋషిభిః ప్రోక్తం శతబ్రాహ్మణభోజనాత్. ౬౧
తత్ఫలం సమవాప్నోతి బ్రాహ్మణే భోజనే కృతే,
అగ్నిప్రజ్వాలనం కృత్వా శీతార్తేభ్యః ప్రయచ్ఛతి. ౬౨
స సర్వలోకేషు చిరం రమతేఽత్ర న సంశయః,
ఆరోగీ గాత్రకాంతిశ్చ భవేజ్జన్మని జన్మని. ౬౩
తస్మాత్ప్రశస్తం భో విప్రా! అగ్నిదానం హి కార్ముకే,
శీతవాతార్తవిప్రాయ వస్త్రం కంబళమేవ వా. ౬౪
యో దదాతి మునిశ్రేష్ఠ! చేహాముత్ర సుఖం లభేత్,
ఉషఃపూజా ధనుర్మాసే లభ్యతే యది మానవైః. ౬౫
త్రైలోక్యే తస్య పుణ్యం చ కో వక్తుం క్షమతే నరః?
అనేకజన్మసాహస్రపుణ్యానాం తు ఫలేన వై. ౬౬
కరోతి వై దేవపూజాం సర్వాభీష్టప్రసిద్ధయే,

---

సంగమంబునను శతబ్రాహ్మణుల కన్నం బిడినఫలంబు నొందును. ఏనరుఁడైన ధనుర్మాసంబున శీతార్తులగువారలకు నగ్నిప్రజ్వాలనంబుచేసి యిచ్చెనేని యాతఁడు జన్మజన్మమునను సకలపుణ్యలోకంబుల సుఖంబు నొంది పిమ్మట నరోగియుఁ గాంతియుతుఁడై పుట్టును. కనుక ధనుర్మాసములో నగ్నిదానము శ్రేష్ఠమయినది. మనుజుఁ డీధనుర్మాసంబున శీతార్తులగువిప్రులకు వస్త్రకంబళాదుల నొసంగెనేని యాతఁ డిహపరసుఖంబులం బొందును. ఈధనుర్మాసపూజచేయువాని పుణ్యము నెన్నుటకుఁ ద్రిలోకంబులందు నెవ్వఁడును లేఁడు. అనేకజన్మంబులం జేసినపుణ్యవిశేషంబున నీధనుర్మాసపూజ లభించును. ఈ

ఏవం కృతా మహాపూజా సర్వదారిద్ర్యనాశినీ. ౭౭
సర్వసంపత్ప్రదా పుణ్యా పుత్రపౌత్రప్రదాయినీ,
భవిష్యతి న సందేహస్సత్యం సత్యం మయోదితమ్. ౭౮
వర్షేవర్షే తు కర్తవ్యం ధనుర్మాసవ్రతం ముదా,
పూజాయాం వర్తమానాయాం పుణ్యాత్మా తు దినేదినే
ధనుర్మాసస్య మాహాత్మ్యం శృణుయాద్భక్తిపూర్వకం,
సత్కథాశ్రవణం విష్ణోర్భయరోగవినాశనమ్. ౭౯
అజ్ఞానతిమిరాంధానాం దీపోఽయం జ్ఞానసిద్ధిదః,
భవరోగనిబద్ధానాం సంసేవ్యం పరమౌషధమ్. ౮౦
మహాపాతకశైలానాం వజ్రోఽయం ధనురుత్తమం,
యే శృణ్వంతి సదా విష్ణోః కథాం భువనపావనీమ్. ౮౨
తే వై మనుష్యలోకేఽస్మిన్వైష్ణవా హి న సంశయః,
యే శృణ్వంతి హరేర్గాథాం ధనుర్మాసకృతాం సదా. ౮౩
తేషాం పాదరజాంస్యేవ తీర్థాని మునయో జగుః,

---

పూజ గావించినవాఁడు సర్వదారిద్ర్యంబులం బాసి సర్వ సంపత్తులం బొందును. ఇది సత్యం బిందులకు సందియము లేదు. మానవుఁడు ప్రతివర్షంబున ధనుర్మాసపూజ చేయుచుండెనేని పరిశుద్ధి నొందును. ఈ ధనుర్మాసంబున భక్తియుక్తుఁడై శ్రీమన్నారాయణదేవునికథలు వినవలయును అట్లు వినుచుండు వానికి భయరోగాదులు కల్గవు. ఈధనుర్మాస మజ్ఞానతిమిరాంధు లగువారికి దీపంబు, భవరోగపీడితులగువారికిఁ బరమౌషధంబు, మహాపాతకశైలంబులకు వజ్రాయుధంబుగా నుండును. ఏనరు లైన నిరంతరము విష్ణుకథల వినుచుండిరేని వారలు వైష్ణవు లనంబడుదురు. అట్టివారల పాదరజమ్ములే సర్వతీర్థములని చెప్ప

తస్మాన్నిశ్రేయసం గంతుం యేఽభివాంఛంతి దేహినః. ౨౪
యే శృణ్వంతి సదా భక్త్యా ధనుర్మాసకథామిమాం,
యద్యశక్తశ్చిరం శ్రోతుం శీతవాతభయార్దితః. ౨౫
ముహూర్తం వాపి శృణుయాన్మాసమేకం నిరంతరం,
అతః ప్రతిదినం శ్రోతుం ధనుర్మాసవ్రతం శుభమ్. ౨౬
అశక్తో యది మర్త్యోఽసౌ శీతవాతాదిపీడితః,
తే వైధృతౌ వ్యతీపాతే దశమ్యాం ద్వాదశీదినే. ౨౭
అష్టమ్యాం పౌర్ణమాస్యాం చ తథా పుణ్యదినేష్వపి,
ధనుర్మాసస్య పూజాం వై యః కుర్యాద్యది మానవః. ౨౮
స నిష్క్రమ్య చ సంసారాద్దగ్ధ్వా దుష్కర్మకాటవీం,
యే శృణ్వంతి సదా భక్త్యా న తేషాం భవదుర్గతిః ౨౯
యే నాఽచరంతి మనుజా ధనుర్మాసవ్రతం శుభం,
చండాలయోనిం తే యాంతి దశజన్మసు నారద! ౩౦
యత్ఫలం సర్వయజ్ఞేషు సర్వదానేషు యత్ఫలం,

---

దురు. మోక్షముఁగోరువారు ఁడీధనుర్మాసమున హరికథల వినవలయును. అట్లు వినుటకు శీతవాతములచే నశక్తుఁడయ్యేనేని ప్రతిదినం బొకముహూర్తకాలంబైన వినవలయును. అట్లును నశక్తుఁ డయ్యేనేని వైధృతివ్యతీపాతలయందును దశమీద్వాదశులయందును అష్టమిపూర్ణిమ మొదలైన పుణ్యదినములయందైన భక్తిచే హరికథల వినవలయును. ఈధనుర్మాసవ్రతముఁ జేయువారలు సంసారకష్టములం బాయుదురు. వారలకు దుర్గతులు లేవు. ఈధనుర్మాసవ్రతము చేయువారికి సర్వయజ్ఞదానఫలంబులు గల్గును. శుభకరమైన యీధనుర్మాసవ్రతము నెవ్వరాచరించరో వారు పదిజన్మములఁ జండాలజాతియందుఁ

సకృ ద్ధనుర్మాసచరా త్తత్ఫలం విందతే నరః. ౧౧
యే న కుర్వంత్యజానంతో ధనుర్మాసవ్రతోత్తమం,
పితృతో మాతృతశ్చైవ కులమేకోత్తరం శతమ్. ౧౨
పచ్యంతే నరకే ఘోరే యావత్కలిశతత్రయం,
దృఢపుష్టిశరీరోఽపి హిమశీతభయాన్నరః. ౧౩
న కరోతి హి పాపాత్మా క్రిమికీటాదిజంతుషు,
భూత్వాభూత్వా తథాఽన్యాని శరీరాణ్యథ లభ్యచ. ౧౪
సప్తస్వ ర్వేషు ఘోరేషు నరకేషు వసన్ సదా,
తదంతే భువమాసాద్య విష్ఠాకూపే క్రిమిర్భవేత్. ౧౫

బుట్టుదురు. సర్వయజ్ఞములు చేయుటవలనను సమస్తదానములు చేయుటవలనను గలుగుఫలమొక్కమారీధనుర్మాసవ్రతాచరణమువలనఁ గలుగును. మోహాంధులై యుత్తమోత్తమంబగు నీవ్రతంబు నాచరింపకుండిరేని తండ్రిపార్శ్వమునను దల్లిపార్శ్వమునను నూటయిరువదితరములవారితోఁగూడ మూఁడువందలకలియుగములు మహాఘోరమగు నరకముల బాధింపఁబడుదురు. ఏనరుఁడైన శరీరపుష్టిగల్గియు శీతభయమున నీవ్రతం బాచరింపకుండెనేని యతఁడు అనేకనరకములం బొంది పిమ్మటం గ్రిమి కీటాదియోనులం బుట్టును. ఏమానవుఁడైన నీవ్రతంబు దూషించుచో నతఁడు యమదూతలచేఁ బీడితుఁడై నరకబాధ నొందును. ఆతనికిఁ గల్పశతములకైన నివృత్తిలేదు. ఇతిహాసపురాణాదుల నీధనుర్మాసవ్రతము చెప్పఁబడెను. ఈవ్రతముతో సమానమయినది వేదములందుఁగాని పురాణములందుఁగాని లేదు. ఈవ్రతంబాచరించువానిం జూచి యముఁడు విపన్నవదనుఁడై వాఁడెట్టిపాపములఁ జేసియున్నను నాపాపంబులఁ బోఁగొ

నిందకా వై న కరోతి స్మ మూఢాత్మా పాపచేతనః,
పచ్యతే నరకే ఘోరే యమదూతైర్భయానకైః. ౮౬
నరకాత్తరణం నాస్తి తస్య కల్పశతైరపి,
ఇతిహాసపురాణాని భూయో భూయో మహాముసే! ౮౭
సర్వదైవ తు కర్తవ్యం కర్తవ్యం ధర్మమిచ్ఛతా,
న వేదేషు పురాణేషు ధనుర్మాసవ్రతం సమమ్. ౮౮
నియతస్తం వ్రతం దృష్ట్వా ధనుర్మాసప్రపూజనం,
వివర్ణవదనో భూత్వా తత్పాపం మార్జయేద్యమః. ౮౯
ధనుర్మాసవ్రతం వత్స! మాసమేకం నిరంతరం,
కుర్యాత్సర్వప్రయత్నేన విత్తలోభవివర్జితః. ౯౦
తదర్ధమాసం వా కుర్యాదథవా షడ్దినేషు వా,
అష్టార్ధదివసేష్వేవ హ్యేకస్మిన్దివసేఽథ వా. ౯౧
న కుర్యాద్యది లోభేన యాంచత్కల్పశతత్రయం,
అనుభూయైవ దుఃఖాని సర్వేషు నరకేషు చ. ౯౨
తదంతే భువమాసాద్య సర్వయోనౌ సముద్భవేత్,
పాపావసానే యో వత్స! విష్ఠాశీ గ్రామసూకరః. ౯౩
భూత్వాఽంతే పాపశేషాణాం విష్ఠాకూపే క్రిమిర్భవేత్,
నరకోత్తారణం నాస్తి దుఃఖాన్యేవ పునఃపునః. ౯౪

---

ట్టును. ఈ వ్రతమును నియమముచే నొకమాసంబు చేయ వలయు. అట్లుగాకున్న సర్ధమాసంబైన నారుదినములైన నాల్గు దినములైన నొకదినంబైన లోభము లేక చేయవలయును. అ ట్లును జేయకుండెనేని యతఁడు కల్పశతము నరకములం బొంది యనేకబాధ లొంది పిమ్మట సూకరాదియోనులం బుట్టును. వానికి నరక మెప్పటికిని దప్పదు. ఎల్లప్పుడును దుఃఖములే సంభ

అశక్తో వ్యాధితో వాపి స్త్రీ వృద్ధో శూద్రజోఽథవా,
అన్యైర్వా కారయిత్వా తు తైస్సాకం భోజనం చరేత్.
తస్య పాపాని నశ్యంతి వహ్ని ప్రక్షిప్తతూలవత్,
అశక్తస్సర్వదా కర్తుం యోవా కోవాఽపి మానవః. ౯౬
యాచిత్వా ధనధాన్యం తు ధనుర్మాసనిమిత్తతః,
కర్తవ్యం సర్వదా విష్ణోర్బ్రాహ్మణానాం తు పూజనమ్. ౯౭
కరిష్యే వై ధనుర్మాసం యాచయిత్వా ధనం ముదా,
న కరోతి హి లోభేన తమాహుర్బ్రహ్మఘాతుకమ్ ౯౮
లోభేన యో ధనుర్మాసం సంపన్నోఽపి దరిద్రవత్,
మానవో యది యాచేత తమాహుః పాపినం బుధాః.
అశక్తః సర్వదా కర్తుం కారయేద్వాఽన్యమానవైః,

---

వించుచుండును. వ్యాధిపీడితుఁడైన వృద్ధుఁడయిన స్త్రీయయిన శూద్రుఁడైన నీవ్రతమును జేయ నశక్తులయి రేని అన్యుల చేతంజేయించి వారలం గూడి తాము భుజింపనగును అట్లు చేసినవారి పాపంబులెల్ల నగ్నిదగ్ధంబైన దూదియుంబోలె క్షణమాత్రంబున నశించును. ఈధనుర్మాసమునఁ బూజచేయుటకు ధనము లేమి నశక్తుం డయ్యేనేని పరుల యాచించియైన ధనము సంపాదించి చేయవలయును. ఎవఁడేని ధనుర్మాసపూజకై యాచించి ధనం బార్జించి లోభముచే నాధనము వ్యయముఁ జేయకున్న నతఁడు బ్రహ్మఘాతుకుం డనఁబడును. ఏనరుఁడైన తాను సంపన్నుఁడయ్యును దరిద్రునిరీతి ధనుర్మాసమునకై పరుల యాచించునో యతఁడు స్వర్ణస్తేయియనుమహాపాతకి యనం బడును. నరుఁడు తా నశక్తుఁడైనను బరుల యాచించి వారిచే నీధనుర్మాసపూజ చేయించెనేని యాతఁడు ధనుర్మాసఫలచతు

ధనుర్మాసఫలస్యాసౌ చతుర్థాంశం లభే త్తతః. ౧౦౦
ధనుర్మాసేన సర్వేషాం నశ్యంతే పాపరాశయః,
వర్ధతే ధర్మరాశిశ్చ శుక్లపక్షే యథా శశీ. ౧౦౧
యథా రత్నాని వర్ధంతే సముద్రే వివిధాన్యపి,
తథా భాగ్యాని వర్ధంతే ధనుర్మాసవ్రతోత్తమాత్. ౧౦౨
దీపదానం ప్రశస్తం హి ధనుర్మాసప్రపూజనే,
గోఘృతేన చ వై దీపమథ వా తిలతైలతః. ౧౦౩
అఖండదీపాన్కృత్వా చ విష్ణవే పరమాత్మనే,
అప్రయేద్యది పుణ్యాత్మా సర్వరోగాత్ప్రముచ్యతే. ౧౦౪
దీపో దదాతి వై జ్ఞానం దీపో వై భాగ్యదో భవేత్,
మాసే మాసార్ధకే వాపి దశైకదినసేఽపి వా. ౧౦౫
యస్మిన్దినే సమాప్తిస్స్యాత్తదా తాం ప్రతిమాం వ్రతీ,
బ్రాహ్మణాయ సుశీలాయ వేదశాస్త్రార్థవేదినే. ౧౦౬
దద్యాత్సదక్షిణాం జాతు వ్రతసంపూర్తిహేతవే,

---

ర్థాంశము నొందును. ధనుర్మాసవ్రతంబువలన పాపములు నశించును. ధర్మంబు శుక్లపక్షనిశాకరుఁడుంబోలె దినదిన ప్రవర్ధమానం బగును. సముద్రంబున రత్నంబు లెట్లు వృద్ధినొందు నట్లు భాగ్యములు వృద్ధినొందును. ఈధనుర్మాసమునఁ బరమాత్ముఁడైన శ్రీమన్నారాయణదేవునకు గోఘృతంబునం గాని తైలంబునం గాని యఖండదీపప్రదానము మాసంబైన నర్ధమాసంబునైనను బదిదినములైనను జేయువాఁడు సకలరోగములం బాసి సౌభాగ్యంబునొంది సుజ్ఞానియునగును. నరుఁడు ఏదినంబున నీవ్రతంబు సమాప్తి నొందునో యాదినంబున వేదశాస్త్రంబుల నేర్చి శీలవంతుఁడైన బ్రాహ్మణునకు దక్షిణాపూర్వ

మధుసూదన! దేవేశ! ధనుర్మాసఫలప్రద! ౧౦౭
తవ మూర్తిప్రదానేన మమ సంతు మనోరథాః,
ఇతి ప్రతిమాదానమంత్రః.
ధనుర్మాసే మునిశ్రేష్ఠ! షోడశైరుపచారకైః. ౧౦౮
బృందావనే తు తులసీం ప్రత్యహం పూజయేద్యది,
స ముక్తస్సర్వపాపేభ్యో విష్ణులోకం వ్రజేత్పుమాన్.
ధనుర్మాసే ప్రశస్తం హి తులసీపూజనం మునే!
కరోతి చేద్గవాం పూజామన్నగ్రాసపురస్సరమ్. ౧౧౦
సర్వాసాం దేవతానాం వై మృష్టాన్నస్య ప్రదో భవేత్,
ప్రదక్షిణత్రయమతో యః కరోతి గవాం మునే! ౧౧౧
భువః ప్రదక్షిణే యచ్చ తత్పుణ్యం లభతే ధ్రువం,
యత్ఫలం సర్వయజ్ఞేషు సర్వతీర్థేషు యత్ఫలమ్ ౧౧౨
సకృత్పురాణశ్రవణాత్తత్ఫలం విందతే నరః,

---

కంబుగా, ఓమధుసూదనా! ఓదేవేశా! నీమూర్తిదానంబుచే నాకు ధనుర్మాసఫలం బిచ్చి నామనోరథంబుల ఫలింపఁజేయు మనుచు నొసంగవలయును. ఈధనుర్మాసమునఁ బ్రతిదినమును షోడశోపచారములఁ దులసీపూజ చేయవలయును. అట్లు చేసిన వాఁడు వైకుంఠమునకుం బోవును. ధనుర్మాసమునఁ దులసీపూజ ప్రశస్తమయినది. ధనుర్మాసమున నరుఁడు శాస్త్రోక్తప్రకారముగా గోవునకుఁ బూజచేసి అన్నము పచ్చిక మొదలగునవి పెట్టినేని సమస్తదేవతలకు మృష్టాన్నమిడినవాఁ డగును. ప్రదక్షిణత్రయముఁ జేసెనేని యాతఁడు భూప్రదక్షిణఫలము నొందును. ఈమాసమున నొకప్పుడైన విష్ణుపురాణము విన్న వాఁడు సర్వయజ్ఞఫలము నొందును. సర్వతీర్థస్నానఫలమును

కలౌ హీనాఽయుషో మర్త్యా దుర్బలాశ్శ్రమపీడితాః. ౧౧౩
దుర్మేధసో దుర్వ్యభాజో ధర్మాచారవివర్జితాః,
ఇతి సంచింత్య భగవాన్సర్వవ్యాపీ రమాపతిః. ౧౧౪
హితాయ తేషాం విదధే మాహాత్మ్యం ధనుషోఽపి హి,
పిబన్నేవామృతం యత్నా దేకాదశ్యాం జరామరః. ౧౧౫
నైవేద్యభక్షణాద్విష్ణోః కులమేవాజరామరం,
గురవస్సంతి లోకే తు జన్మతో గుణతశ్చ యే ౧౧౬
తేషామపి చ సర్వేషాం పురాణజ్ఞః పరో గురుః,
భవకోటీషు సర్వాసు భూత్వా భూత్వాఽవసీదతామ్.
యో దదాత్యపునర్వృత్తిం కోఽన్యస్తస్మాత్పరో గురుః,
అతస్సంపూజయేన్నిత్యం వ్యాసం గురుమకల్మషమ్. ౧౧౭
గంధపుష్పాక్షతైర్ధూపైర్వస్త్రైరాభరణాదిభిః,
సంపూజయేత్తథా వ్యాసం తతో నీరాజనాదిభిః. ౧౧౮

---

బొందును. ఈకలియుగమున నరులు హీనాయుష్కులు దుర్బలులు బహుశ్రమపీడితులు ధర్మాచారవర్జితులై యుందురు. అట్టి వారికెల్ల హితంబగునని యీధనుర్మాసవ్రతము భగవంతుఁడు గల్గఁజేసెను. నరుఁ డేకాదశినాఁ డమృతము ద్రావియుండెనేని జరామరుం డగును. ఆయమృతంబె శ్రీవిష్ణుదేవునకు నైవేద్యమొసంగిత్రావెనేని యాతనివంశమునఁ బుట్టినవారెల్ల జరామరులగుదురు. లోకమున ననేకమందిగురువులు కలరు. వారికెల్లఁ బౌరాణికుఁడుత్తముఁడు. అతనిచే భవకోటిసహస్రములనుండు బాధలం బొందక పునరావృత్తి లేనిమోక్షమునొందం దగుఁ గావున నరుఁడు గంధపుష్పాదిషోడశోపచారముల వ్యాసపూజ

వ్యాసపూజాం న కుర్వంతి లోభమోహాయుతో నరః,
ధనుర్మాసఫలం నాస్తి దుఃఖీ స్యాజ్జన్మజన్మని. ౧౨౯
పూజయేత్సర్వయత్నేన ధనుర్మాసి మునీశ్వర!
ధనుర్మాసస్య మాహాత్మ్యం శృణ్వంతి శ్రావయంతి యే. ౧౩౦
ఇహలోకే సుఖం ప్రాప్య లభేయుః ఫలముత్తమం.

ఇతి శ్రీమదథర్వణరహస్యే కపింజలసంహితాయాం
బ్రహ్మనారదసంవాదే త్రిషష్టితమోఽధ్యాయః.

---

గావింపవలయును. ఏనరుఁడైన ఈధనుర్మాసమున లోభముచే వ్యాసపూజ గావింప కుండెనేని యాతఁడు ధనుర్మాసఫలము నొందఁజాలక జన్మజన్మములకు దుఃఖవంతుఁడై పుట్టును. కావున భక్తిచే వ్యాసపూజ చేయవలయును. ఈధనుర్మాసమాహాత్మ్యము విన్నవారును పరులకుం జెప్పినవారును నిహలోకంబున సమస్తసుఖము లనుభవించి పరలోకంబున నుత్తమమయిన సాయుజ్యపదవి నొందుదురు.

శ్రీధనుర్మాసమాహాత్మ్యము సమాప్తము.

---

## విష్ణుదేవస్తోత్రమ్.

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం,
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్. ౧

## లక్ష్మీస్తోత్రమ్.

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురాం,
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరాం
త్వాం త్రైలోక్యకుటుంబినీంసరసిజాంవందేముకుందప్రియామ్.

## పంచాయుధస్తోత్రమ్.

స్ఫురత్సహస్రారశిఖాతితీవ్ర
సుదర్శనం భాస్కరకోటితుల్యం,
సురద్విషాం ప్రాణవినాశి విష్ణో
శ్చక్రం సదాఽహం శరణం ప్రపద్యే. ౧
విష్ణోర్ముఖోత్థానిలపూరితస్య
యస్య ధ్వనిర్దానవదర్పహంతా,
తం పాంచజన్యం శశికోటిశుభ్రం
శంఖం సదాఽహం శరణం ప్రపద్యే. ౨
హిరణ్మయీం మేరుసమానసారాం
కౌమోదకీం దైత్యకులైకహంత్రీం,
వైకుంఠ వామాగ్రకరాభిమృష్టాం
గదాం సదాఽహం శరణం ప్రపద్యే. 3

రక్షోఽసురాణాం కఠినోగ్రకంఠ
చ్ఛేదక్షరచ్ఛోణితదిగ్ధధారం,
తం నందకం నామ హరేః ప్రదీప్తం
ఖడ్గం సదాఽహం శరణం ప్రపద్యే.
యజ్జ్యానినాదశ్రవణాత్సురాణాం
చేతాంసి నిర్ముక్తభయాని సద్యః,
భవంతి దైత్యాశనిబాణవర్షి
శార్ఙ్గం సదాఽహం శరణం ప్రపద్యే.
ఇమం హరేః పంచమహాయుధానాం
స్తవం పఠేద్యోఽనుదినం ప్రభాతే,
సమస్తదుఃఖాని భయాని సద్యః
పాపాని నశ్యంతి సుఖాని సంతి.
వనే రణే శత్రుజలాగ్నిమధ్యే
యదృచ్ఛయాఽఽపత్సు మహాభయేషు,
ఇదం పఠన్ స్తోత్రమనాకులాత్మా
సుఖీ భవేత్తత్కృతసర్వరక్షః.
యచ్చక్రశంఖం గదఖడ్గశార్ఙ్గం
పీతాంబరం కౌస్తుభవత్సలాంఛితం,
శ్రియా సమేతోజ్జ్వలశోభితాంగం
విష్ణుం సదాఽహం శరణం ప్రపద్యే.
జలే రక్షతు వారాహః స్థలే రక్షతు వామనః,
అటవ్యాం నారసింహశ్చ సర్వతః పాతు కేశవః.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1940.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | 6 |
| డిటో A. S. P. అయ్యరుగారిది ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు ... | 2 | 0 |
| రాజశేఖరుడు, గోపాలుడు ... | 0 | 12 |
| చార్ దర్వీషుకథలు ... | 1 | 0 |
| తాతాచార్యులకథలు ... | 0 | 12 |
| బేతాళనికథలు ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు ... | 0 | 8 |
| పురాణగాథలు I ... | 1 | 0 |
| ,, II ... | 1 | 0 |
| బాజీరాయని చరిత్ర ... | 1 | 4 |
| రఘువంశకథ ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, భా. రామమూర్తిశాస్త్రి ... | 1 | 8 |
| ఈసపునీతికథలు, 1-వ భాగము ... | 0 | 8 |
| డిటో 2-వ భాగము ... | 0 | 12 |
| పంజాబుఅల్లరి ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు ... | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు ... | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర ... | 0 | 12 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు ... | 0 | 6 |
| నల ,, ... | 0 | 8 |
| సావిత్రి ,, ... | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, ... | 0 | 8 |
| ప్రహ్లాదచరిత్ర ,, ... | 0 | 6 |

| | | రు॥ | అ॥ |
|---|---|---|---|
| | ప్రతి 1కి | | |
| వైగ్యలకథలు | ... | 0 | 4 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| రేచుక్క పగటిచుక్క కథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |

## నవలలు

| | | | |
|---|---|---|---|
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| సీతారామము | ... | 1 | 4 |
| ఐవన్హో, నవల | ... | 0 | 12 |
| విజ్జలదేవి ,, | ... | 1 | 8 |
| రాధారాణి ,, | ... | 0 | 6 |
| దుర్గేశనందిని ,, | ... | 1 | 0 |
| లక్షణ్య నవల | ... | 0 | 12 |
| లీల ,, | ... | 0 | 6 |
| దిలారామ ,, | ... | 2 | 0 |
| కోవలన్ కన్నకి | ... | 0 | 12 |
| వీరబాల ,, | ... | 0 | 8 |
| ఆనందమఠ, నవల | ... | 1 | 12 |
| లాలాబాయి ,, | ... | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము ,, | ... | 2 | 0 |
| రోషినార, చరిత్రవిషయికమగు నవల | ... | 0 | 12 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | ... | 3 | 0 |
| దేశభక్తుడు | ... | 1 | 0 |
| శంభుతో నొకనాటిసహవాసము | ... | 0 | 4 |